# పంచబాణ సంచా

(శృంగార వచన కావ్యం)

డా. జె. బాపురెడ్డి

జయం పబ్లికేషన్స్
హైదరాబాదు

# పంచబాణ సంచా

(శృంగార వచన కావ్యం)

డా. జె. బాపురెడ్డి

జయం పబ్లికేషన్స్
హైదరాబాదు

**Panchabana Sancha** - Free verse in **Telugu**
(Festival of Romance)



Price Rs. 25 - 00
U.S. $ 5

Published by -

**Jayam Publications**
Plot 10, Road 5, Jubilee Hills,
Hyderabad 500 034, A.P. INDIA

Printed at
**Vipla computer services**
1-8-725/A/1/A, Balaji Bagyanagar Apts.
Nallakunta, Hyderabad - 500 044

Cover design - **Dr. K. Seshagiri Rao**

Dedicated to Sri **D.S. Reddy** ( Priston, U. K .) under the auspices of Andhra Association (U.K.) and released b **Mrs. Yoga Mulukutla** on 24-6-1989 at London. First Cop presented to **Dr. K. Satyanarayana** ( London ).



* ఆవిష్కర్త *కృతి భర్త *కృతి కర్త

ఆంధ్ర ప్రదేశ్‌లోని పశ్చిమ గోదావరిజిల్లాకు చెందిన నత్తా రామేశ్వరం గ్రామంలో రైతు బిడ్డగా పుట్టి తన ప్రతిభా శక్తితో ఇంగ్లండులో కాలు పెట్టి , తెలుగు సాహిత్య సంస్కృతులకు బ్రిటన్‌లో చిన్మయ దీపంగా వెలుగుతున్న ఆత్మీయులు **శ్రీ ద్వారంపూడి సుబ్బిరెడ్డి** గారికి స్నేహోపాయనంగా అంకితం.

# ఆవిష్కరణ

తెలుగు వెలుగులు ఖండాంతరాలలో వెదజల్లుతున్న ఆంధ్ర అసోసియేషన్ (U.K) ఆధ్వర్యంలో **శ్రీమతి యోగ ములుకుట్ల** గారిచే 24-6-1989 నాడు లండన్‌లో ఆవిష్కరించబడినది.

# ప్రథమప్రతి ప్రదానం



వైద్య విద్యాధికుడై, ప్రజాసేవా తత్పరుడుగా ప్రసిద్ధి చెందిన స్నేహశీలి, బహుముఖ ప్రతిభాశాలి

**డా॥ K. సత్యనారాయణ** (F.R.C.S. లండన్) గారికి

అభిమాన పురస్సరంగా

ఈ పుస్తకపు తొలి ప్రతి సమర్పించబడినది:

తీయని తలపుల తరగల
థేమ్స్ నదీ తీరంలో

"ఎకనామిక్సు సుందరి" నా తొలి శృంగార భావ వచన కవిత. ముప్పదేళ్ల క్రితం వ్రాసిన ఆ కవిత ఆ నాటి నుండి ఈ నాటివరకూ డా॥ సి. నారాయణరెడ్డి వంటి రసజ్ఞుల విజ్ఞుల ఆదరాభిమానాలకు పాత్రమైంది. ఉస్మానియా విశ్వవిద్యాలయ స్థాయి తెలుగు కవితల పోటీలో దానికి ప్రథమ బహుమతి లభించినట్లు గుర్తు. యువక విద్యార్థినీ విద్యార్థులనే గాక, ఖండఖండాంతరాలలో ఆబాలగోపాలాన్ని అలరించిన భావపుష్పం అది. శాస్త్ర విజ్ఞాన సౌందర్య ప్రజ్ఞాన సమదర్శనం, రసాత్మకంగా రవళించిన సురభిళనాదం అది. అందుకే శృంగార భావోద్దీప్తమైన నా తొలి వచన కావ్యసంపుటి "పంచబాణ సంచా" లో ప్రయోగించిన మొట్టమొదటి వెలుగు పూవుటమ్మయింది. ఇందులోని కావ్య సుమ శరాలన్నీ నా జీవితానుభవ వసంత విలాసాలే.

శృంగారాన్ని బంగారందా మూటగట్టుకొని, కష్టాల గట్లను, కన్నీటి కాలువలను తరిస్తూ సౌందర్య సీమలవైపు సాగిపోయే బాటసారిని నేను. ఆధ్యాత్మిక స్పృహకూ, సామాజిక స్పృహకూ మధ్య ఆనంద క్రీడ శృంగారం. శృంగార కళ లేని జీవితం చుక్కలు లేని ఆకాశం. నా దేశ విదేశ పర్యటనలలో నేను చూచిన శృంగార సీమల ప్రసక్తి ఈ కావ్య శక్తి అయింది. వినోదాత్మక ప్రేమ సీమలలో విహరించే జీవాత్మల కళాత్మక చిత్రణమే ఈ "పంచబాణ సంచా".

సెక్సు నిత్య జీవిత సత్యం. దాన్ని పవిత్రమైన లింగ ప్రతీక శక్తిగా ఆరాధించే ఆదరించే సంప్రదాయం సంస్కారం భారతీయులది. స్త్రీ పురుషులలో కామ వాంఛా ప్రదీపకుడైన పంచబాణున్ని కామదేవతగా భావించిన జీవన తత్వం మనది. ఒక్క భారతదేశంలోనే కాదు, గ్రీకు రోమను వంటి ప్రాచీన నాగరికతా సంస్కృతులు కూడా రతీ మన్మధులు మానవ జీవితాలమీద కలిగించిన ప్రభావాన్ని పవిత్రమైన కళాతత్వ భావంతోనే గుర్తించి కీర్తించారు. జరా రుజా మరణాలను ప్రతిఘటించే

ప్రాణ శక్తిగానే విశ్వ సాహిత్యంలో శృంగార రస పోషణ జరిగింది. సౌందర్యాత్మకమూ, సృజనాత్మకమూ అయిన శృంగారానికి, సామాజిక పరమైన వ్యావహారిక పరమైన నీతికి అక్రమమైన ముడిపెట్టి ఆ రెంటినీ భంగపరచిన వింత తత్వంనుండి స్త్రీ పుంస యోగ శక్తిని రక్షించవలసిన అవసరం ఉంది. నీతి, ఉపకరణానికి సంబంధించింది కాదు, ఉపయోగ పరమైంది. "కామ శక్తి" ఒక బలవత్తరమైన జీవానందోపకరణం. దాని అభివ్యక్తి మనం ఏర్పరుచుకున్న సామాజిక నైతిక విలువలను బట్టి ఉంటుంది. ఒక కామ శక్తినే కాదు ఏ మానవ శక్తిని కూడ దురుపయోగం చేయటం అవినీతిగానే పరిగణించాలి. కత్తిని మనిషి కుత్తుక కోయడానికి ఉపయోగిస్తే తప్పు కత్తిది కాదు. శృంగారానికీ, వ్యభిచారానికీ తేడా తెలియని సామాజిక నీతి ప్రమాదకరం. శృంగారం శృంగారంగానే ప్రణయశక్తిగానే శోభిస్తే అది జీవిస్తుంది. వ్యభిచారం నశిస్తుంది.

"పంచబాణ సంచా" బాణసంచాత్మక పంచబాణ విలాసము. ఈ మధుర పర్వ కాంతి హాసము దేశ దేశాలలో మోసులెత్తింది. హాలండులోని పూలతో, ఇంగ్లండులోని గాలితో, ఐరోపా హృదయంతో, భారతీయాత్మలో చైతన్య స్పందనం పొందిన మధుర భావ విహంగం ఈ కావ్యం. మానవ శరీరం లోని రక్తమాంసాలు భౌతిక రాగ శక్తులై తాత్విక యోగ యుక్తులై ఆలపించే సరస సమతానంద శృంగార విప్లవ గీతం ఇది. అమానుష మారణాయుధాలతో, స్వార్థ పరత్వ సంకుచితత్వ సమర నాదాలతో పతనమయ్యే మానవ జాతికి సృజనాత్మకమైన నిర్మాణాత్మకమైన, శాంతిమయ, సౌఖ్యకర జీవితాదర్శాన్ని అందించే సౌందర్యలహరిగా ఈ పంచబాణసంచా రూపించాలని ఆకాంక్షిస్తున్నాను. ప్రణవాత్మక ప్రాపంచిక ప్రగతి సత్యోద్దీపకమైన ప్రణయ తత్వ ప్రబోధానికి ఈ పంచబాణసంచా నవవైతాళిక గీతం కావాలని ఆశిస్తున్నాను.

ఈ పుస్తకాన్ని చారిత్రాత్మక, మహిత మానవనాగరికతా క్షేత్రమైన లండన్‌లో ఆవిష్కరించే అవకాశం కల్పించిన ఆంధ్రా అసోసియేషన్ (U.K) వారికి నేనెంతో కృతజ్ఞుణ్ని. భాగతభారతికి ఖండాంతరాలలో విజయ హారతి పట్టే ఈ తెలుగువారి వెలుగు బావుటా క్రింద నాకు 1979 లో 1982లో జరిపిన సాహిత్యాభిమాన సత్కారాలు నేను జన్మజన్మాలకు మరిచి పోలేని మధుర ఘట్టాలు. ఈ కృతిని కాలాన్ని కాలిచే కోవెలయైన ద్వీపఖండంలో అఖండరాగజ్యోతిగా వెలిగించగలగడం

నా సుకృతిగా భావిస్తున్నాను. చిరకాలంగా U.K. లోని తెలుగువారి సాహిత్య సంస్కృతుల వికాసానికై నిస్వార్థసేవ చేస్తున్న మిత్రులు శ్రీ ద్వారంపూడి సుబ్బిరెడ్డి గారికి ఈ గ్రంథం స్నేహోపాయనంగా అంకితం చేస్తున్నందుకు ఆనందవర్ధనుణ్నౌతున్నాను. తెలుగుదనం రూపుదిద్దుకున్న సౌజన్యమూర్తి, ఆంధ్రా అసోసియేషన్(U.K)ద్వారా నిరంతరం తెలుగుతల్లికి అంకిత భావంతో సేవచేస్తున్న త్యాగయోగిని శ్రీమతి ములుకుట్ల యోగాగారు ఈ గ్రంథాన్ని ఆవిష్కరించడం నాకు ఎంతో సంతోషం కలిగిస్తున్నది. ఆత్మీయతకు స్నేహశీలతకు మారుపేరైన డా॥ కె. సత్యనారాయణ (FRCS London) గారు ఈ కృతి తొలి ప్రతిని స్వీకరించడం కూడా నాకెంతో గర్వకారణంగా ఉంది. వీరందరికీ నా ముకుళిత హస్త ముద్రను కృతజ్ఞతాభిధగా అందిస్తున్నాను.

ఆంధ్ర అసోషియేషన్ ప్రగతికి దోహదం చేస్తున్న సభ్యులందరికీ ప్రత్యేకంగా సంస్థ అధ్యక్షులు శ్రీ కంభంపాటి రామకృష్ణ గారికి, కార్యదర్శిని శ్రీమతి టి. వసంత గారికి నా అభినందనలు - శుభాకాంక్షలు. నా సాహిత్య తపస్సును ప్రోత్సహిస్తున్న డా॥పి. మీరాఖాన్ (Dr. P. Meera Khan- Holland ) గారు, శ్రీమతి డా॥ ఎస్తర్ గ్రెస్ (Dr. Esther Gress - Denmark) గారు, శ్రీమతి టిల్లీ (Tilly Boesche - Zachrow - Germany) గారు ముఖ్యంగా పేర్కొనదగిన వారు. ప్రియమిత్రుడు ప్రపంచ ప్రఖ్యాత జన్యు శాస్త్రజ్ఞుడు సాహిత్య ప్రభావ్రతుడు డా॥ పి. మీరాఖాన్‌గారికి ఈ మధ్యే నా "ప్రేమారామం" గేయ కావ్య సంపుటిని అంకితం చేసే అదృష్టం కలిగింది. ఆ అమృతానుభూతికి అనుబంధమే ఈ ఆనంద సన్నివేశం.

థేమ్స్ నదీ తీరం మీది నా అంతరంగంలో పొంగుతున్నవి ఎన్ని స్మృతి తరంగాలో ఎన్ని కృతజ్ఞతా భావ తరంగాలో ఎన్నలేను. అయినా, ఈ సందర్భంలో ఎన్నో విధాల నన్ను అభిమానించి ఆదరించిన ఆత్మీయులు డా॥ సి. ప్రభాకర రెడ్డి, డా॥ వి. వీరారెడ్డి, శ్రీ ఎస్. కె. ఆర్. విశ్వనాధ, డా॥ యం. బి. జయరాజ్, డా॥ కె. జయ చంద్రారెడ్డి, శ్రీ .జె.పి.యల్. గ్విన్, శ్రీ టి. జగన్మోహనరెడ్డి, శ్రీ దరిగాల రామచంద్రరావు, శ్రీ యల్. ఒ. బ్యాంక్స్, శ్రీ మైఖేల్ ఎఫ్. బార్‌ఫోర్డ్, డా॥ మల్లారెడ్డి, శ్రీ రంగారెడ్డి మొదలైన వారందరికీ నా కృతజ్ఞతా పూర్వక అభివందనలు తెలుపుతున్నాను. వాళ్లో పెంపొందే అంతర్జాతీయ సాహిత్య చైతన్యానికి దోహదం

చేస్తున్న ఇలాంటి ప్రపంచ వ్యాప్త మిత్రులందరినీ నా సౌభ్రాత్రతా ఆర్ద్రనేత్రాలతో స్మరిస్తున్నాను. తెలుగు సాహిత్య సంస్కృతులకు విశ్వవేదిక మీద ప్రతిష్ఠాత్మక పీఠం కల్పించాలనే నా దీక్షా సంకల్పాలు అనతి కాలంలో నెరవేరుతాయని విశ్వసిస్తున్నాను. ఖండఖండాలలో భారతీయ సంస్కృతిని పరిమళింప చేస్తున్న తెలుగు వారి ప్రతిభా పాటవాలు ఇందుకు శ్రీరామ రక్ష.

ఈ గ్రంథ ప్రచురణలో నాకు సాహిత్య స్ఫూర్తిని, సకల విధాల సహాయాన్ని అందించిన ఆప్త మిత్రులు డా॥ బోయి భీమన్న, ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగార్లకు నా గౌరవ పూర్వక నమస్సుమాంజలులు. వారు ఎంతటి కళా ప్రపూర్ణులో అంతటి జగద్విఖ్యాత విమర్శకాగ్రేసరులు. నా సాహితీ యజ్ఞంలో భాగస్వామినియైన నా జీవితానంద రాగధుని, నా సతీమణి జె. రాజేశ్వరిగారికి నా ప్రేమ పూర్వక ధన్యవాదాలు. ఈ పుస్తకాన్ని ప్రచురించిన జయం పబ్లికేషన్స్ వారికి, ముఖ్యంగా శ్రీ జె. మారుతి గారికి, ముచ్చటైన ముఖ చిత్రాన్ని రచించిన ప్రఖ్యాత చిత్రకారుడు డా॥ కొండపల్లి శేషగిరి రావు గారికి, అధునాతన సాంకేతిక పాటవంతో సర్వాంగ సుందరంగా ఈ గ్రంథాన్ని ముద్రించిన విప్ల కంప్యూటర్ సర్వీసెస్ వారికి, ప్రత్యేకంగా ఆ సంస్థ అధిపతి శ్రీ యమ్. విజయసేనారెడ్డి గారికి ప్రశంసాపూర్వక కృతజ్ఞతలు.

లండన్ — జె. బాపురెడ్డి

**24 – 6 – 1989**

**శనివారం.**

# పంచబాణ సంచా

(శృంగార వచన కావ్యం)

# ఏకనామిక్స్ సుందరి

వసంతాన్ని
ఓ యూనిట్‌గా తీసుకున్నా
ప్రేయసీ!
నేను చేస్తున్న
నీ అధర సుధా కన్‌సంప్షన్
లా ఆఫ్ డిమినిషింగ్ యుటిలిటీకే
ఓ ఎక్సెప్షన్ -

ప్రణయనీ !
నీ ఒక్క కవోష్ణ గాఢ పరిష్వంగానికి
నా జీవిత సర్వస్వమూ రేట్
అయినా
నాకు కన్‌స్యూమర్స్ సర్‌ప్లస్
ఇన్ ఫినిట్ -

రాణీ!
నీ ఒయ్యారము; కనుచూపులు
చిరునవ్వులు
నాలో మధుర భావాల ప్రొడక్షన్‌కి
బాగా పని చేస్తున్నవి
త్రీ ఫ్యాక్టర్స్ ఆఫ్ ప్రొడక్షన్ లాగా -

కామినీ!
నీవు లేని ఒక్క క్షణం కూడా
ఎకనామిక్ డిప్రెషన్‌లో ఉన్న
దేశం రీతి
నా శరీరపు
ప్రత్యంగమూ స్తంభించి
కల్గిస్తుంది నాకు భీతి -

జవ్వనీ!
నేను నీతో బ్యాక్ చేయబడనపుడు
జీరో పర్చేజింగ్ పవర్‌లో ఉన్న
కన్స్యూమర్‌లా
ఈ ప్రకృతిలోని
ఏ రమణీయ దృశ్యాన్ని
డిమాండ్ చేయలేను -

రమణీ!
నీతో పాటు
పోటీగా చెలామణి అవుదామని
రంగం మీదికి వచ్చే
ప్రతి బోగసు కరెన్సీ నశిస్తుంది
గ్రెషమ్స్‌లా ఉల్టాగా
ఆపరేషన్ లోకి వస్తుంది -

తన్వీ!
నీ పద ధూళి అనే
మెన్యూర్ పడినపుడు
నా థర్డ్ గ్రేడ్ హృదయ క్షేత్రంలో సైతం
ఇన్‌క్రీజింగ్ రిటర్న్‌లో పడుతుంది
అందాల ఆనందాల పంట –

మనోహరీ!
~~ఈ~~ గీతం
ఎంత పొద్దుగైనా రాయగల్గుదును నేను
కాని
నీ ఎకనామిక్స్‌లోనే చెప్పినట్లు
మార్జినల్ యుటిలిటీ మరీ దాటి పోతే
మైనస్ యుటిలిటీ
మీద పడుతుందేమోనని
భయపడుతున్నా నంతే!

# ప్రణయ ప్రళయం

నీవు వసంతానివై వస్తావనే
ఇన్నాళ్లు
నా బ్రతుకు తోటను పెంచుకున్నాను
చిరునవ్వుల పువ్వులతో
వలపు తెమ్మెరలతో
వచ్చేయి నెచ్చెలీ!
ఈ విరహ శిశిరం నుంచి
వెంటనే నన్ను విడిపించు -

నీ ప్రేమ వర్షం కురిపిస్తావనే
నా యౌవన క్షేత్రంలో
ఎన్నో క్రొత్త ఆశల విత్తనాలు చల్లాను
ప్రణయినీ!
కడతేర్చు ఈ ప్రవాసపుటనావృష్టి -

వీడని నీ బిగి కౌగిట్లో
వాడని స్వర్గ సుఖం ప్రసాదిస్తావనే
దేవతలను కాదని
ఓ దేవీ !
నిన్నే కొలిచాను
ఇక నన్నీ ఎడబాటు నరకం నుంచి
విడిపించు -

నీ గాజుల మాటలు
నీ అందెల పాటలు
విందామనే
మరేదీ వినకుండా
నీరవస్థితిలో నిలిచి ఉన్నాను
నీ మీదే ధ్యానం నిలుపుకున్నాను.
రాగమయీ !
నా శూన్య జీవితంలో
సుందర నాదాలు నించు-

ఏదో కల్పించి వ్రాస్తున్న
కవిత్వం కాదిది
కాలిపోతున్న నాగుండె
జాలిమొర ఇది
విషమిస్తున్న నా జీవిత
విపత్కాల గానం ఇది
చెలీ! కరుణించు !
ఈ శరణాగతుణ్ని రక్షించు -

# కలాన్ని కందని కళామయి

ఎక్కడలేని ఊహలను
లెక్కలేని అనుభూతులను
జీవనిర్భర భావ చిత్రాలలో
నిలిపే నా కలం
నీ రూప కళా విభవం  చూచి
తల వాల్చి కంపిస్తూంది
తనగొంతు కదుప లేక;
కోమలీ! నిన్ను ఆహ్వానించే దెలా
నా గుండె బరువు తీరే దెలా!

మిన్నేరు నీ కాళ్ల మీదే ప్రవహిస్తుందా !
మెరుపు కన్నెలు నిన్నే స్పృశించి నర్తిస్తున్నాయా!
నీ అంగాంగంలో
సుధా స్రవంతులు పొంగి పొరుతుంటే
నీ అధరపుష్పంలో సంధ్యారుణిమ
మధుర గీతాలు పాడుతుంటే
నా చకితాంతరంగంలో
నవభావన లేవో వికసిస్తున్నాయి
ఈ సృష్టికి అర్థాలు
ఈ నాటికి స్ఫురిస్తున్నాయి –

వాక్కులకూ ఊహలకూ చిక్కవని
విధిలేక ఒప్పుకుంటాయి
విశ్వసాహిత్యాలు;
రంగులకూ రాగాలకూ అందవని
లోకంలోని కళలన్నీ పూదండలై
నీ కంఠాన్ని పూజిస్తాయి –

శస్త్రాలూ, సకల అణ్వస్త్రాలూ
నీచూపు చలువలో
మంచు గడ్డలుగా నిలిచి పోవా!
పాపాలూ పంకిలాలూ
నీకంటి దీపాల వెలుతురులో
తానమాడితే పుణ్య తీర్థాలైపోవా !

నీ మదిలోని భావ పుష్పాలనుండి
ఒలికి పడే ఉఛ్ఛ్వాస సౌరభాలను
మోసుకు పోయే పిల్లగాడుపులకంటే
ధన్యాత్ములెవరు? పుణ్యాత్ములెవరు ?
స్వర్గమనేది ఉండి చచ్చినా
నిన్ను చూచిన కళ్లు
అక్కడ చూచేది మట్టి మన్ను –

ఎన్నాళ్లుగా ఈ మట్టి గోళం
తపస్సు చేసిందో
ఈ నాటికి దాని కోర్కె ఫలించింది

నీ అసద్రస పాద ముద్రల్లో తరించింది
నీ మందస్మిత కాంతి భూషలు ధరించింది –

నవ యౌవన మోహినీ!
కనిపిస్తూంది సర్వశాస్త్రార్థ సారం
నీ దరహాస మకరంద ధారలో;
శబ్దాలు, అలంకార శాస్త్రాలు
నీలో చూచుకొని, తమను తాము సరిచూచుకొని
శోభిస్తున్నాయి –

రమణీ! ఎంత రమణీయము
ఈ నీ జీవితోత్సవం
కళలన్నీ రంగురంగుల బావుటాలై
సాహిత్యాలన్నీ సరస కావ్య సౌరభాలై
సౌందర్యాలన్నీ మహోజ్జ్వల దీప మాలికలై
ఆనందాలు స్వాగత తోరణాలై
జరుపుతున్న ఈ మహోత్సవం
మైమరచి నాలోని కన్నులు తెరచి
దర్శిస్తున్నాను హర్షం వర్షిస్తున్నాను
నిజమైన కలవోలె నీ యశః కళవోలె
జీవిస్తున్నాను.

# జడపూల గొడవ

చల్లని ఆ సాంధ్య రాగంలో
మల్లెపూల మాల
నీ కందీయ వస్తే
ఒల్లనని నీవన్నపుడు
మధు వసంతంలాంటి నా హృదయంలో
విధుర శిశిరం తాండవించింది
చిలుకలాంటి నీ ముఖంలో
సింహం హుంకరించింది –

నిజమే
అడుగలేదు నన్ను నీవు
ఆ మాలిక కావాలని;
అడిగింది
ఆ ముగ్ధ మోహన మాలికయే
నీవు కావాలని
మాలికమాట కాదనలేక
అందించ వచ్చాను దాన్ని నీకు
నీ మాట కాదనలేక
నిరర్థకం చేశాను దాని బ్రతుకు –

జె. బాపురెడ్డి

అందాల నీ జడతో
పొందుకోరిన ఆ మాలిక
అభిరుచిని మెచ్చుకుంటున్నాను
కాని
అదృష్టంలేని నా ద్వారా
నిన్ను చేరాలనుకున్న
ఆ అమాయిక మాలిక
తెలివి తక్కువతనానికి
చింతిస్తున్నాను –

నీ వంటే
ఆ పూల కెంత అభిమానమో
ఆ పూలంటే
నాకంతకన్నా అభిమానం
మీ ఇద్దరినీ జత కూర్చలేక
పొందాను నేను అవమానం
మీ ఇద్దరికీ
దూరమై నానేమోనని
కుందుతున్నాను అస్తమానం
జడపూల గొడవలో చిక్కుపడి
జడభరతుణ్నైనాను –

# చీకటి తెర

సూర్యదీపం ఆరిపోగానే
చీకటి తెర పడిపోగానే
గుండె గూటిలో ప్రాణాలు
గుస గుసలు పెడతాయి
వెలుతురులో చేయడానికి
వెరచే కార్యక్రమాలు
చీకటిలో చేపడతాయి -

నరాలను ఉసికొలిపే
నాదాల కోసం
అంగాలను పొంగించే
ఆవేశం కోసం
చూపును గమ్మత్తు చేసే
మత్తు మంత్రం కోసం
పంచప్రాణాలు పంచేంద్రియాలు
పంచబాణుని
పంచలో చేరుతాయి
పగలుచే పరిహసించబడిన బ్రతుకులు
దిగులుతో
రగిలిపోయే బ్రతుకులు
రేయి కౌగిటిలో పరవశిస్తాయి
కాలం కడుపులో కలవరిస్తాయి-

అంగారం కురిసే ఆకాశపు బారి నుం
శృంగారం గొడుగు పట్టుకొని
బ్రతికి పోతాయి
సూటిగా తీర్చుకోలేని కోర్కెల్ని
చాటుగా తీర్చుకుంటాయి.

వినోద వృక్షాల మీద
విరిసిన విలాస ప్రసూనాలు
విరజిమ్ముతున్నాయి
మధురావేశ పరిమళాలు –
సంధించిన తనూ ధనువులు
విడిచే హావభావబాణాలు
ఉద్రిక్త యువ రక్తాన్ని
చవి చూస్తున్నాయి –

రుజా జరా మరణాల
రుద్ర ఘోషకు బెదరక
జీవితాలు విజృంభిస్తున్నాయి;
ఆనంద బృందావనంలో
రాధా మాధవ రాగంలో
రవళిస్తున్నాయి
భాషాతీత మతాతీత
మానవతా శృంగారాత్మ
చీకటిని చీల్చుకొని శోభిస్తున్నది

# హాలండులో పూలపొంగులు

మంచు కురిసింది
మల్లె మొగ్గల్లాగా
మొయిలు కడలి నుండి తాణికి పడిన
మంచి ముత్యాల్లాగా

వడగాడుపులకు
వాడి పోయిన నాలో
వాసంతం కుసుమించింది
ప్రసన్న మధుర హిమపాతం
పాడింది అపూర్వ సంగీతం –

"హిమ పాతం – హిమ పాతం
హేమంత సంగీతం" అంటూ
హర్షమే వర్షమై
హాలండు హృదయాన్ని
అలుముకున్న అనుభూతిలో
భావగీతాలు పాడుకున్నాను
నీటి మీద పాల మీగడల్ని
తోటల్లో వెన్నెల తేటల్ని
బాటల్లో మొల్లల మూటల్ని
దర్శిస్తూ ఆడుకున్నాను –

చేయి చేయి గిలించి
హాయి హాయిగా వీధుల వెంట
సాగిపోయే వలపు జంటలపై
కురిసిన మల్లెల జల్లులు కని
నాలో విరిసిన ఆనందంతో
గూటికి చేరుకున్నాను –

బయట ఉన్న చలికి చమరిస్తూ
ప్రక్కలో లేని చెలిని ఊహిస్తూ
గదిలో చీకటి హృదిలో
నిదుర పోయాను
స్వప్నం కన్న సుందరమైన
సత్యాలను చూడబోయాను –

బారులలో, కారులలో, దారులలో
బాణాల్లాగా దూసుకుపోయే " బాలల్ని "
చూడడానికి, వాళ్ల అందాలను త్రాగడానికి
నా మత్తు కళ్లు
ఎన్నెన్ని చోట్లకు నన్ను తీసుకుపోయాయో
ఎంతగా నన్ను త్రిప్పి వేశాయో
చెప్పుక పోతే అదే ఒక
గొప్ప గ్రంథం అవుతుంది –

ఎత్తు మడిమల కాలి జోళ్ల మీద
పుత్తడి బొమ్మల్లాగా
టిక్కు టిక్కున సాగిపోయే
అక్కడి హంస యానల
ఆ పాద జఘన నగ్న సౌందర్యం
అందీ అందని ఆనంద హర్మ్యం –

ఓ వైపు ముందుకు లాగే యౌవనం
మరో వైపు వెనక్కి లాగే యౌవనం
మధ్య చిక్కిన నడుములతో
తడబడే అంగనల బాధ
తడి ఉన్న ప్రతివాని గుండెలో
విడివడని అనంగ బాధ!
ఊరికే పోరు వారు
ఓరగంట చూస్తారు
ఊరకే చూడరు వారు
ఓరగా నవ్వుతారు
ఉద్దేశ్యం ఏదైనా
ఒరులను కవ్విస్తారు
నవయౌవనం పడగలెత్తిన
నాగిన్నులై నడుస్తారు
బుసకొట్టే పడుచుదనాల
భోగిన్నులై నిలుస్తారు –

లతాంగుల సుమ హాసాలకు
కుసుమాస్త్రుని ప్రసవ శరాలకు
తట్టుకోలేక హేమంతం
తరలిపోయింది.
మంచుదాడులకు భయపడి
మట్టిలో దాగిపోయిన
సుగంధాలను వెంటబెట్టుకొని
వసంతం రానే వచ్చింది
వన్నెలాడులు చాలరని
వన్నె చిన్నెల పూలు తెచ్చింది -

ఉందో లేదో బృందావనం
ఉందో లేదో నందనవనం
కాని ఉంది ఎక్కడలేని అందాల పూలకడలి
"కుకెన్ హాఫ్" అక్కడ -
పూలకు బాల్యం యౌవనం తప్ప
వృద్ధాప్యం లేదు,
అందం ఆనందం తప్ప
ఆవేదన లేదు
పూలకున్న భాగ్యం అందుకే
పూబోడులకు లేదు
కోరకం హసించి హసించి
సంయోగంలో పరవశించి అయిస్తుంది
ముదిమి అంటక ముందే నిష్క్రమిస్తుంది -

# నడి రాత్రి

స్కాండినేవియాను చూచి
స్పందించని వాడుండడు
అక్కడ కవిత్వం రాయలేని వాడు
ఎక్కడా కవి కాలేడు
శృంగారం అంగారం కాదు
బంగారం అక్కడ
చలిలో కుంపటిలాగా
జడివానలో గొడుగులాగా
మండువేసవిలో చలివేంద్రంలాగా
సెక్సును
స్వేచ్ఛగా వాడుకుంటారు
సినిమాల్లో ప్రదర్శించుకుంటారు
చిత్రశాలల్లో అలంకరించుకుంటారు
నడివీధుల్లో అమ్ముకుంటారు
చెడిపోకుండా పెంచుకుంటారు
గర్భాలు గర్భస్రావాలు లేకుండా
కాంట్రాసెప్టులు వాడుకుంటారు –

స్వీడన్‌లో సెక్సు విద్య గూర్చి
రాయల్ కమీషన్‌నే నియమించారు
ప్రకృతి ఇంద్రియాల మీద
వికృత నిర్బంధాలు తొలగించారు –

స్వేచ్ఛగా జరిగేది, చెడైనా
స్వచ్ఛంగా ఉంటుంది
దొంగచాటుగా జరిగేది, మంచైనా
ఛండాలంగా మారుతుంది
ఇన్హైబిషన్లకు
హిపోక్రసీలకు
మంచి మంచి పేర్లు పెట్టి
వంచించు కోవటం  కంటే
చేసేది చెప్పుకోవటం
చేతగాంది ఒప్పుకోవటం
మేలని పదివేలని
అనిపించింది నా కక్కడ -

నార్వీజియన్ కొండలోయల్లో
నవహిమ మల్లికా తల్పాలమీద
స్కీయింగ్ క్రీడా వినోదాలలో
తేలిపోయే
ఆనంద స్నపిత యువ జన సందోహాన్ని
ఎలా వర్ణించడం?
వినీల వియత్తలంలో వికసించిన
అగణిత తారల సౌందర్యాన్ని
ఆశు కవిత్వంలో చెప్పడానికి
ఎలా సాహసించడం!

ఆస్లో లోని ఒక్క
వీలండ్ పార్క్ చాలు
అందులోని ఒక్క
నగ్న శిల్ప కల్పనమే చాలు
నాలుగు కాలాల పాటు నిలిచే
నవీన కావ్యం రాయటానికి -

నడిరాత్రి
గడియారపు రెండు ముళ్లు
ప్రేయసీ ప్రియులవలె
పెనవేసుక ఒకటై పోయిన
అందాల అర్ధరాత్రి
కోపన్ హేగన్‌లో
నీటికాలువ ఒడ్డుమీద
నీటుగా కూర్చున్న ఓ బోటితో
మాట్లాడిన నాలుగు మాటలే
వినేవాళ్లు ఉంటే
మెచ్చుకునే వాళ్లు ఉంటే
తెలుగు కవిత్వపు చరిత్రలోనే
అపూర్వమైన
అనుభూతి కావ్యంగా మలచవచ్చు

అంబుధి తరంగాలలో తేలడానికి
అభ్యంగన స్నానమాడడానికి
వలువలు విప్పి గట్టుమీద పెట్టగానే
సుడిగాలికి అవి వలాహకాలై పోతే
సిగ్గుతో శిలామూర్తియైన
చిన్నారిలా అనిపించింది
బాల్టిక్ సముద్ర తీరాన
వినీల శిలా ఫలకం మీద
వివస్త్రయై కూర్చున్న మర్ మేడ్ -

నీటిలో మునిగి పోతుంటే
తాను రక్షించిన రాజ కుమారు డెవరో
తన కోర్కెలనే నీట ద్రోసిపోగా
తలపుల తపస్సులో మునిగిన
తరుణయౌవన రాగవతియట ఆమె -

కలలకూ - కథలకూ
కమ్మని వాస్తవికతకూ
మూర్తిగా కీర్తి గడించిన
ఆ ముగ్ధ సౌందర్యరాశిని
చోద్యంగా చూసే
సుందరతా దిదృక్షతా యాత్రికులను
చూడలేక తలవాల్చిన
ఆ మాననీయ మత్స్యకన్యను
జీవితంలో మరచిపోలేను.

# ఓహో సోహో !

ఓహో! ఆహా అనిపించే
సోహో శృంగార వీధుల్లో
నైట్ క్లబ్బుల్లో
కామకలాపాలు
కామినీ నగ్న నాట్యాలు
నాటకాలు బూటకాలు
చూడకుంటే
చూడాలనిపిస్తుంది
చూస్తే
ఏమిటి చూశాం
అనిపిస్తుంది

అరటిపండు మీది
తొక్కలు తీసినట్లు
ఉల్లిపాయమీది
పొరలు దూసినట్లు
ఒంటిమీది గుడ్డలు తీసివేసి
ఉన్నట్లే ఉండి స్ట్రిప్‌టీజ్ చేసి
అగ్ని కీలల్లాగ నగ్న నాట్యాలు చేసే
గబ్బి గుబ్బెతల ఘన జఘనల
వీర విలాసినుల వింత అభినయాలు

సరదాగా చూడాలంటే  చల్లగా ఒకరాత్రి
లండన్‌లోని
సోహోకు వెళ్లిరావాలి
ఎక్కడున్నావు సోహో! అంటే
పికడెల్లి పక్కనున్నానని కులికే
మధుర వాడకు వెళ్లిరావాలి -

"గజం మిథ్య పలాయనం మిథ్య "
మాయా వాదంలో పడి
"కామినులు ఆడడం  మిథ్య
కళ్లారా మనం చూడడం మిథ్య"
అనుకొని ఇంటికి వచ్చేస్తే
ఏ ఇబ్బందీ లేదు
అదంతా మంచా ? చెడా ?
అనే ప్రసక్తి రాదు.

# ఎత్తుల గమత్తులు

"ప్యారిస్ అనగానే మనం
స్వైరె పోతాం గదా !
ఇంతదాక రానే వచ్చాం
అక్కడి వింతలు చూద్దాం పదా"
అన్నది ఆనాడు నా మనస్సు
అంటుందనుకూంటా నిప్పుడు
అదే మాట మీ వయస్సు-

ప్యారిస్ నగరం నిండా
కళా పరిమళాలు గుబాళిస్తాయి
ఏ వంక పోయినా నిన్ను
ఏవేవో ఆకర్షిస్తాయి
అంబర చుంబి అయిఫల్ టవర్ పైనుంచి
ఆశ్చర్యంతో చూస్తుంటే
పురగాథా కలాపాలు విప్పి
ఆడే కలాపిలా కనిపిస్తుంది
ప్యారిస్ నగర బాల
కన్నీటి పన్నీటి సరసిలోని
కలువపూల మాల -

చక్కని చిలకలాగా
చక్కెర బొమ్మలాగా
ఎటుపోయినా హాయిగా
ఏది చూచినా తీయగా
ఉంటుంది అందాల ప్యారిస్ నగరం
డెందం ఉన్న వాళ్లకు దేవుడిచ్చిన వరం –

పిగాల్ వినోద వీధుల్లో
ఎగాడి. తిరిగే ఒంటరి వాళ్ల
తుంటరి మొగాల మీద
తృప్తి కనిపించదు
వేషాలు, సీసాలు, హాసాలు చూపి
మోసాలు చేసే నెరజాణలు
పంచే ఆనందం వాస్తవం కాదు
అయినా అది
వట్టి భ్రమ అనిపించదు. –

ఎత్తు మడిమల జోళ్లు ఎత్తు నితంబాలు
ఎత్తు ఉరోజాలు ఎత్తు శిరోజాలు

ఈ ఎత్తుల గమత్తుల
మత్తులో పడగానే
ఎత్తు కుసుమధనుస్సు
మన్మధుడు
అప్పుడు
రతులు మన మతులు హరిస్తారు
మనిషిని కాదు డబ్బును వరిస్తారు
విలాసాలు వినోదాల విపణి వీధుల్లో, మరి
విలువలు వింతగా ఉంటాయి
తెలివిగా బేరమాడలేక పోతే
తెల్లమొహం – ఖాళీ జేబు
మిగులుతుంటాయి –

ఆగకుండా పడవలు సాగడానికి
అంగనల తొడల అందాలు చూపడానికి
గాలి వీచనక్కరలే దిప్పుడు
ఆవిరి ఇంజన్ పుణ్యమా అని –

"మకరధ్వజుని కొంప ఒక వంక కనుపింప"
చీరకట్టారో లేదో చిగురుబోండ్లునాడు
కాని శ్రీనాధుడు నేడుంటే
పనీ పాటు మానేసి
మినీ స్కర్టుల మీద

అన్ని వంకలా కనిపించే
ఆ కొంపల మీద
చిత్రమైన సీసాలతో
పడి చెప్పేవాడే
బోలెడంత చాటుకవిత్వం
అక్కడి కలికి మిటారుల
గుండె ముడులు విప్పి
ఆవిష్కరించేవాడే
అంగడి అనంగతత్వం –

# చెకొస్లొవేకియా చిన్నది

పొట్టనిండా తినాలీ అంటే
పుష్కలంగా తాగాలీ అంటే
ఆభరణాలు అలంకారాలు లేని
అచ్చమైన
అందాలు చూడాలంటే
నావంటి పేదావాళ్లకు
నాకం చెకస్లోవేకియా -

ఎర్రని కపోలాలు
అంతకన్నా ఎర్రని పెదాలు
వన్నెల శిరోజాలు
వన్నె వన్నెల నయనాలు
వంపు సొంపులు, ఒయారాలు
అక్కడి
అమ్మాయిల సహజాభరణాలు
మనవంటి మెత్తని వాళ్లను
మరీ మరీ వేచే శరాలు
మనవైపు వాళ్లు చూడకున్నా
వాళ్లను మనమే ఎగాదిగా చూస్తాం
మనల చూచి
వాళ్లు మందహాసం చిందించకున్నా
మనమే చిలిపినవ్వులు చిలికిస్తాం -

ద్రవ్యాలు కూడబెట్టని
రాగ ధనులు వారు
పరిమళ ద్రవ్యాలు వాడని
సురభిళాత్మలు వారు
వర్ణనల వలల కందని స్వర్ణ మీనలు వారు
పురుషులతో సమానంగా
పోటీపడి పనిచేస్తారు
కష్టఫలంతో ప్రణయాన్ని కలిపి జీవిస్తారు
అందుకే నావంటి కవుల
అభిమానం చూరగొన్నారు -

కామ్రేడ్ కర్షకులు కొందరు
కమ్మని విందు చేసినపుడు
మగ్గుల నిండా బీరు
మనస్సునిండా స్లివోవిచ్
తాగి తప్పినపుడు
నిదురపోనీయని నాదంలో
కాలం తాండవమాడినప్పుడు
పొందిన మహానుభూతులు
మాటలకు అందని వసంత గీతులు
వెలుగు చీకటులకు వంతెన కట్టిన
వెన్నెల జ్యోతులు
అందుకే ఆ అమృత సన్నివేశాలు
మీ మధురోహలకు వదిలేస్తున్నాను

# తమస్సులో మనస్సు

అది న్యూయార్కు కలల పార్కు
గాలిలో తేలియాడే గంధర్వనగరం
అడ్డంగా పొడుగ్గా అల్లుకున్న
వీధుల వలలో చిక్కిన
మరుల మత్స్య కన్యల
మధుర సాగరం అది

అది హ్యాంబర్గ్ హేమదుర్గం
భానుడు ఉదయిస్తాడేమోనని
భయపడే
"రేభాను" రే వాడ –
అది ఆంస్టర్డాం అమృత ధామం
చీకటి ఆకాశంలో
చిత్రమైన సింగిణులు
రంగులు వెదజల్లే రసధామం

అది బ్యాంక్కాక్ వలపు షాక్
కష్టాల నేలన్నూ
కలల నింగినీ కప్పి వేసే
కామకలాపాలు విప్పి
కాలంతో రసకేళి సలిపే
రమ్య రహెూరాగ పక్షి అది

ప్రబంధాలలో చదివింది
వాత్స్యాయన కామసూత్రాలల్లో
వర్ణనలుగానే మిగిలింది

వాస్తవమై వెలుగుతున్న
వైకుంఠపురా లవి
విద్యుద్దీప కిరణాల వికీర్ణ వర్ణ వేదిక లవి -

నరులూ కిన్నెరులూ
ఇంద్రులూ రసిక చంద్రులూ
మత్తెక్కిన హృదయాలతో
సగోన్నద్విగ్న నాట్యాలాడే
కామాగ్ని యజ్ఞాలవి -

రతీ మన్మధులకే
రమణీయ రహస్యాలు నేర్పే
లైంగిక విద్యాలయా లవి
శృంగార పీఠాలవి
కొక్కోక విజ్ఞాన ప్రజ్ఞానాలకు కోటలవి
సత్యా సత్య జీవన సౌందర్య
శివానంద మిధున బృందావనాలవి
చిత్రాతి చిత్ర అకాల వసంత క్షేత్రాలవి -

పశువులూ, పక్షులూ మృగాలు, ఖగాలు
జల చరాలు, భూచరాలు
ఉభయ చరాలు కూడా
జలదరించే, పళ్లికిలించే
హింసా రిరంసా విలాసాలు
దర్శించిన నా కళ్లు
కడుక్కుంటున్నాను
వేద వేదాంత కాసారాలలో
దేశకాల పారావారాలలో -

# వద్దంటేనే ముద్దు

వద్దన్నప్పుడు
ముద్దిడితేనే ముద్దు
ముద్దు ఇమ్మని ముందుకు వచ్చే
ముద్దు గుమ్మలు కద్దు -

వద్దన్నారని
యువతులు యువకుల
వద్దకు పోకుంటే
కావాలంటూ
యువకులు, యువతుల
వద్దకు రాకుంటే
ఇద్దరు కలసి గుద్దుకు చచ్చే
పద్ధతి వస్తుంది -

వద్దంటే ముద్దు నయమా
ముద్దంటే వద్దనడమా
హద్దులు మీరిన ముద్దులు మేలా !
ముద్దులు తీరని హద్దులు మేలా !

ముద్దులు వద్దను ముద్దుగుమ్మల
వద్దకు చేరరు మొద్దబ్బాయిలు
ముద్దుల ముద్దలు తిని తిని
పెదవులు
మొద్దుబారవలె ముద్దుగుమ్మలకు
ముద్దుల విద్దెలు, వలపుల సుద్దులు
నేర్పిన వారికి లేవే హద్దులు -

# శృంగ భంగాలు

నీవు ఆరబోసిన కురులు
ముచ్చట గొలిపే నీముఖం మీద
సయ్యాటలాడినప్పుడు
పంటితో నొక్కిన నీ పెదవుల మీద
విరులేవో పాటలు పాడినప్పుడు
వింతగా చూశాను నిన్ను
నా బ్రతుకంతా నీవే అయినట్లు -

తోటలో నీ పయ్యెద
చిరుగాలితో ఆడుకున్నప్పుడు
చంకలలో
రెండు ఇత్తడి కడవలు అదుముకొని
నీలాటిరేవుకు పోయే
పుత్తడి బొమ్మలా భాసించావు
ఆ వసంతోదయ ప్రాంగణంలో -

నేను ఏరుకున్న పూవులన్నీ
కోరుకున్న తావులన్నీ రాసుకున్న రంగులన్నీ
నీ మెలికలు తిరిగిన మేనిలో
తిష్ఠవేసి
నా శూన్య హస్తాలను చూస్తూ
నవ్వుకున్నాయి

బరువులన్నీ నీవు మోస్తూ
బాధ నాకు కలిగించావు
ఋతువులన్నీ కలిసిన
ప్రకరణం నీవైపోయి
త్రిముఖాలుగా చీలిపోయిన
త్రికరణం చేశావు నన్ను.

పిల్లికి చెలగాటం
ఎలకకు ప్రాణగండం అన్నట్లు
నీకు శృంగార శృంగాలు
నాకు శృంగ భంగాలు.

# ప్రేమికులకు జై

అన్ని దేశాల్లో
అన్ని కాలాల్లో
మనుషుల మీద మనసుల మీద
అధికారం చెలాయించేవి
ఆకలి - సెక్సు

ఆకలి లేకుంటే
అభ్యుదయత్వం లేదు
సెక్సు లేకుంటే
శృంగార తత్వం లేదు

ఆకలి సెక్సులు
ఈ కలిలో
అత్యాచారాలు చేయకుంటే
బ్రతికి పోతుంది మానవత్వం
వెతక వలసిన అవసరం ఉండదు
దైవతత్వం

ఆకలితో కేక లేసే వాళ్లకు
సెక్సుతో పని అట్టే లేదు
సెక్సులో పడి కొట్టుకునే వాళ్లకు
ఆకలి తీరుతున్నట్టే లేదు
ఆకలి సెక్సు - సెక్సు ఆకలి
అందాల పదబంధాలతో
ఆనందం అనుభవించే
డెందాలను ఏమందాం ?

"యుద్ధాలు చేసి చావకండి
ప్రేమించుకొని బ్రతికి పోండి"
అన్న పెద్దల మాట పెడచెవిని పెట్టని
ప్రేమికులకు జై అందాం -

# అగ్గి బంతులు

చలిపెడుతూంది చెలీ!
అంటే
రగ్గు కప్పుకొమ్మన్నావు
అగ్గితో తీరని చలి
రగ్గుతో తీరుతుందా !

చలి అంటే నాకు భయం
అందుకే నీ అండ చేరింది,
అభయహస్తం పట్టు
నా కండరాలను కొరికేస్తున్న
చలిపులిని
త్రిప్పి కొట్టు –

నిస్పృహాయుణ్ణి నన్ను చూచి
నిగ్ర నీల్గిన చలి
నీ కరబంధనాలలో నలిగి
నీ నిట్టూర్పులలో రగిలి
నా దేహాన్ని
నగ్నంగా వదిలేసి
చీకటి కిటికీ సందుల్లోనుంచి
సిగ్గుతో పారిపోతూంది –

అగ్గి బంతులతో
ఆడుకోవలసిన
నామగసిరిని
రగ్గు బొంతల్లో దాగుకొమ్మని
బుగ్గి సలహా ఇస్తావా
గడసరి!
అగ్గేదో రగ్గేదో
తెలియదనుకున్నావా
సొగసరి!

ఎక్కడుందో చలి
ఇప్పుడు చెప్పు
ప్రేమార్తిని నన్ను
పెడదారి పట్టించడం తప్పు -

# నేర్చుకుంటున్నాను

ఇన్ని వర్ణించిన భావశిల్పిని నేను
నిన్ను వర్ణించడం నేర్చుకుంటున్నాను
ఇన్ని సాధించిన నేను
నిన్ను సాధించడం నేర్చుకుంటున్నాను

నీ చరణాలు స్పర్శిస్తూ
నీ శిఖరాలు దర్శిస్తూ
నిన్ను వరించడం
భరించడం
నేర్చుకుంటున్నాను -

చిత్ర నక్షత్ర పరివ్యాప్తమైన
చీకటి ఆకాశాన్ని
వ్యంజించే
నా శబ్ద శిల్పంతో పాటు
గుప్త సంక్షిప్త
వీక్షణ తారాతరంగనాదాలను
వ్యాఖ్యానించే
నీ నిశ్శబ్దశిల్పం నేర్చుకుంటున్నాను -

నీ సరళ వక్రరేఖా గణిత
గుణిత జనిత అగణిత
రూపాకారాలను
అవగాహన చేసుకుంటున్నాను -

చెలియా, సకియా
ప్రియా - అంటూ
నా దేవీ!
నిన్ను ఎన్నో పేర్లతో పిలుస్తున్నాను
ఎన్నో తీర్లుగా వలస్తున్నాను
నిన్ను పిచ్చిగా ప్రేమిస్తున్నాను
నీ కోసమే జీవిస్తున్నాను -

# శృంగార హేల

అజంతా సుందరులు
నిజ జీవితంలో లేరని
రసికులు విసుక్కుంటున్నారు
కళ కళ కోసమే అయితే
మరి బ్రతుకెందుకోసమని
బాధపడుతున్నారు

నగ్నంగా ఉన్నదంతా
బూతుకాదని
బట్ట కట్టడమే
నీతి కాదని
భాష్యం చెపుతున్నారు

గోడలమీది బొమ్మలు
వీధిలోకి నడిచి వస్తే
కొంపలు కూలిపోతాయని
లెంపలు వేసుకుంటున్నారు
గుడిలోని పూజారులు –

వాత్స్యాయన కామ సూత్రాలు
వట్టి పుస్తకం కాదు
వాస్తవ జీవిత చిత్రాలు – అని
కోనార్కులో
కజురాహెూలో
రాళ్లు కోళ్లై కూస్తున్నవి
కళ్లు కలలై చూస్తున్నవి

దుప్పటి క్రింది శృంగారపు
దుమ్ము దులపాలని
పస కోల్పోతున్న రసికత్వపు
పరువు నిలపాలని
స్వేచ్ఛ లేని శృంగారం
స్వచ్ఛంగా ఉండదని
పడమటింటిలో మన్మధుడు
పాఠాలు చెపుతున్నాడు
ఖగాలకు, మృగాలకు ఉన్న
కామకళ కూడా మనుషులకు
కరువైపోతుందన్నాడు
శృంగారంతో సరితూగే
బంగారమే లేదన్నాడు -

" పంచాస్త్రుని బాణాలు
పని చేయటం లేదు
కోరికలు తీర్చుకునే తీరకయే లేదు
వాస్తవ జీవితంలో మనవలసిన
వాత్స్యాయన కామశాస్త్రం
వెండితెరమీదకి వెళ్లిపోతున్నది
వికృతంగా, విపణంగా "
అంటూ విలపిస్తున్నారు
పతులతో పేచీ పడలేని
పతివ్రతలు
సతులతో రాజీపడలేని
పత్నీ వ్రతులు -

"సంతాన ప్రాప్తికోసం
సంతోష ప్రాప్తి కోసం
చేసే సంసారం
సంతానానికే పరిమితమైతే
సంతాపం మిగులుతుంది -
పరిమిత సంతానానంతర
ప్రణయాత్మక శృంగారంలో
అపరిమితానందం కలుగుతుంది".
ఆకాశవాణి ఘోషిస్తున్నది
అభ్యుదయ వీణపై -

శృంగారాన్ని శృంగారంగా
శివ సుందర
సత్యానుభూతి వరంగా
సేవించినపుడే భావించినపుడే
సిద్ధిస్తుంది రసానందం -

కళగా ఆరాధించబడిన
శృంగారం
కలగా మిగిలి పోతున్నది
కావ్యానందం బ్రహ్మానందంతో
కలిసి వర్ధిల్ల వలసిన ఆనందం
చెప్పుకుంటేనే సిగ్గుగా
తప్పుకు తిరుగుతోంది -
అక్కరున్న ఆడది
ప్రక్కలో ఉన్న మగాణ్ని
అడుగుతేనే పాపం అన్నట్లు
దురాచారం ప్రబలుతూంది -

సమానత్వం
అన్నిచోట్ల ఉండవచ్చుగాని
ఆలుమగల మధ్య మాత్రం కాదని
చదువుకున్న స్వార్థం
సరసత్వం నడుపుతూంది -
సృష్టి రహస్యం తెలిసిన
స్త్రీని ఆరాధించి అలరిస్తేనే
ఆనందం కురిపిస్తుందన్న
సత్యాన్ని కాలరాచి
అత్యాచారాలు చేసే
పురుషుడు ప్రదర్శించేది
ముష్కరత్వ తస్కరత్వం
పైశాచిక బలహీనత్వం -

ఇన్ని శృంగభంగాలతో
శృంగారం కృంగిపోతూంది
ఆంగికమూ సాత్వికమూ పోయి
వాచికంగానే మిగులుతున్న
అభినవ అభినయ శృంగారాన్ని
ఉద్ధరించే నాథు డెవరు
శివమెత్తించే
వాద్య వాదకు డెవరు
సత్యా మోదకు డెవరు ?

# తులా భారం

"తులా భారం" అంటే
ఏదో పౌరాణిక నాటకం
అనుకున్నాను -

రసకుంభినీ ! నితంబినీ !
నీ నడుము పట్టి పైకెత్తి
నింగి దాక పొంగినపుడు
నిజం తెలిసింది -

నాటకం కాదు
బూటకం కాదు
నీ శాతోదరానికి
అటూ ఇటూ సరితూగేవి
సత్యాలని తెలిసింది -

అందాన్ని అందంతో
రూపాన్ని రూపంతో
ఔన్నత్యాన్ని ఔన్నత్యంతో
ఎత్తుకు ఎత్తు సరితూచే
నీ వింత తనువు త్రాసును
పిడికిటిలో పట్టుకోగానే
నా ఊపిరులు బిగపట్టుకు పోయాయి
నాచూపులు
అటూ ఇటూ కొట్టుకు పోయాయి -

తూకమంటే తూకమే
నీ నిస్తుల తురీయ నాభి
తూచే బంగారు శృంగారం
నా రసిక హృదయానికి
మదనోత్సవ తులాభారం

# పంచబాణ సంచా

పంచబాణ సంచాలో
శృంగార విహార మయూరి
దీప శిఖా పింఛాలు విప్పి నర్తించాలి
రతీ మన్మధుల వోలె
ప్రేయసీ ప్రియులు
సతీ పతులు
గతా గతాల స్వప్నాల
వర్తమాన వాస్తవ రూపాలె
వాంఛాతైలాసిన ప్రేమ దీపాలై
ఆవర్తించాలి -

పరిమిత సంతాన ప్రాప్తి కోసం
అపరిమితానంద దీప్తి కోసం
ప్రణయ శృంగార వరాన్ని
ప్రసాదించిన పరమాత్మను
జీవాత్మ శక్తి కీర్తించాలి

మానవ జాతిని రక్షించడానికి
ప్రాణం పోయినా సరే
పంచబాణాలు వదలని
కుసుమాస్త్రుని మకరాంకుని
ప్రతాప ప్రశంసాంజలిగా
విజయ గర్వ పర్వం గా
అందిస్తున్నాను ఈ కావ్యం
ప్రాచీనాతి ప్రాచీనం
నవ్యాతి నవ్యం
సమీచీనాతి సమీచీనం
దివ్యాతి దివ్యం
ఇందులోని ద్రవ్యం.